శ్రీరస్తు.





# శ్రీకాశీవిశ్వనాథ శతకము

—( తం. గెడంచ )—

రామకృష్ణ సీతారామ సోదరకవులు
శతావధానులు.

శ్రీ జైహింద్ ముద్రాక్షరశాలయందు కర్నూలు
ముద్రింపబడియె.

1950

వెల. 0-4-0

శ్రీరస్తు.







# శ్రీ కాశీవిశ్వనాథ శతకము

—( తంగెడంచ )—


రామకృష్ణ సీతారామ సోదరకవులు
శతావధానులు.



శ్రీ జైహింద్ ముద్రాక్షరశాల కర్నూలుయందు
ముద్రింపబడియె.

1950


వెల. 0-4-0



అభినవబాణకవి - ఆశుకవి చక్రవర్తి - కవిసార్వభౌమ
విద్వాన్. గౌరావఝుల రామకృష్ణశాస్త్రి శతావధాని,
మున్సిపల్ హైస్కూలు పండితుడు, కర్నూలు.



శ్రీ కాశీ విశ్వనాధస్వామివారి దేవాలయము, తంగెడంచ. (నందికొట్కూరు తాలూకా)



శ్రీ అన్నపూర్ణా విశాలాక్షీ కాశీ విశ్వనాథస్వామివారి కల్యాణోత్సవము.

ధర్మకర్త:—మ॥రా॥శ్రీ॥ చాగాపురము చిన్నయల్లప్పగౌడుగారు, పెద్దభార్య సౌ॥ నాగమ్మగారు, చిన్నభార్య సౌ॥ రంగమ్మగారు, కర్నూలు.

## ★ తొలిపలుకు ★



భక్తాగ్రేసరులారా!

కర్నూలుజిల్లా నందికొట్కూరుతాలూకా తంగెడంచ గ్రామము. కర్నూలునుండి శ్రీశైలమునకుఁబోవు మార్గమధ్యమున రోడ్డుపైనున్నది, ఇందు కర్నూలునివాసులును బట్టల వ్యాపారము నందేగాక వెండి, బంగారు వ్యాపారమునందుగూడ యశోధనము నార్జించిన మ॥ రా॥ శ్రీ॥ చాగాపురము చిన్నయల్లచిప్పగౌడుగారును, వీరి పెద్దభార్య- సౌ॥ నాగమ్మగారును, చిన్నభార్య- సౌ॥ చెంచమ్మ గారును. భగవంతుని ప్రేరేపణమున నూతనముగా శివాలయమును గట్టించి; అందు **25-2-1948** సర్వజిత్-మాఘ-బ౧ బుధ వారము ప్రతిష్ఠా సంకల్పమును, **26-2-1948** గురువారము జలాధివాస ధాన్యాధివాసాది శైవాగమ తంత్రమును, **27-2-1948** స్వస్తిశ్రీవిజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు 1869 సరియగు సర్వజిన్నామ సంవత్సర. మాఘ. బ॥3 శుక్రవారము సూర్యోదయాది గం. 10-35 ని- వృషభలగ్న పుష్కరాంశమునందు. సూర్య-విఘ్న- గణపతి- నంది. ధ్వజ. సుబ్రహ్మణ్యాది పరివార శ్వేతశిలావిగ్రహతముగా శ్రీమదన్నపూర్ణా విశాలాక్షీసమేత కాశీవిశ్వానాథ లింగప్రతిష్ఠఁగావించిరి. ఆసంవత్సరమాఘ బ౧౩ మంగళవారము శివరాత్రి నాఁటియుదయమున ధ్వజారోహణము, రాత్రికల్యాణోత్సవము- రాత్రినాలుగుజాములు మహారుద్రాభిషేకము. హరికథ భజనకాలక్షేపమును. మాఘ. బ౧౪ మధ్యాహ్నము షడ్రసోపేతముగా బ్రాహ్మణసంతర్పణము బీదలకన్నదానము. రాత్రి రథోత్సవమును. ఫాల్గుణ. శు౧ పారువేటయు, ఫాల్గుణ శు౨ వసంతోత్సవము- నాకబలి, మున్నైన కార్యకలాపములు లోపము లేకుండ జరిపిరి, అదిమొదలు నేటి 15-2-1950 విరోధిసం- మాఘ బ౧౩ బుధవారము నాఁటి కల్యాణోత్సవము వరకు భగవంతునిసేవ

P. T. O.

యందు వేమరు పాటులేక వేలకొలది ధనమును దెచ్చి స్వామివారి పూజానైవేద్య దీపారాధనలకు లోపము కలుగకుండ బ్రాహ్మణ కుటుంబ పోషణమును, నానావిధ వృక్షోపశోభితంబగు నుద్యానవనమును, నూతనముగా దిగుడు బావిని, గోసంరక్షణశాలలను, భూదానమును సేయుటయేగాక, శ్రీ కాశీవిశ్వనాధ శతకమును వ్రాయించి స్వామివారికిఁ గృతిసమర్పణ మహోత్సవము చేసి, మాదంపతులకు నూతనవస్త్రములును 116—0—0 రూపాయలు బహుమానమును

గావించిరి, యీ దేవాలయమునకెదుట నీ సంవత్సరము నూతనముగా చతుస్తంభోప శోభితంబగు కల్యాణ మంటపమును కట్టించి యందులోనే కల్యాణోత్సవము జేసిరి, " రథస్థం శంకరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే,, అనునట్లు క్రొత్తగా రథమును చేయించి మంగళ వాద్యములతో రథోత్సవము జరిపిరి ఈపీఠికలో దేవాలయమున కెట్టి సంబంధములేని కొన్నివిషయములు పొరపాటున వ్రాయఁబడినవి వానినిసవరించితిమి. ఈదేవాలయ సర్వాధికారియు, ధర్మకర్తయు నగు శ్రీ చిన్న యల్లప్పగౌడుగారికిని వారి కుటుంబమునకును విశ్వనాధస్వామి నిరంతరాయు రారోగ్యభాగ్యము లొసంగి రక్షించుగాత;

ఇట్లు,

విద్వజ్జనవిధేయులు

రామకృష్ణ సీతారామసోదరకవుల

శ తా వ ధా ను లు

క ర్నూ లు.

తేది, **15—2—1950**

శ్రీరస్తు.

# —వంశావతారము—



కం॥ శ్రీవాణీశ రమేశ శ
చీవర మానీంద్ర భక్తసేవితుఁడగు, శా
శీవిశ్వనాథుఁ డనయము
సేవకసంపత్సమృద్ధిఁ జేసెడుగాతన్॥ 1

సీ॥ శైవమతాచార సంప్రదాయకముల
గౌఁడాన్వయము ఘనఖ్యాతినొందె
శివభక్తవరుల యాశీర్వాదమునఁ జౌడ
పాండ్లగోత్రము జగత్ప్రతిభనందె
సత్కార్యదీక్షలఁ జాగాపురమువారి
గృహనామ మతులితకీర్తిఁ బొందె
ధనధాన్యపుత్రపౌత్ర ప్రవృద్ధినితాత
గౌరయ్య సద్యశోగరిమనందె

గీ॥ అతిథులను గన్నబిడ్డలట్లాదరించు
నతనిసాధ్వీమతల్లి బీచమ్మగారు;
ధన్యులిరువురు పూర్వముదశరథుండు
గనినరీతిగ నల్వురఁగనిరి సుతుల॥ 2

సీ॥ తనవారు పరవారలను భేదమెఱుఁగక
మన్నించు పెద్దకేశన్న గౌఁడు,
తనబంధుకోటికిఁ దలలోననాలుకై
యుండుచిన్నకేశన్న గౌఁడు
తననాశ్రయింపనేపనినైన క్షణములో
సలిపెడివాఁడు శేషన్న గౌఁడు
తనదానధర్మంబులను పండితులసెబా
సనఁజేయుఁడు లక్ష్మన్న గౌఁడు 2

గీ॥ పార్వతిని శంకరుఁడు చెట్టఁబట్టురీతి
నిందిరను మాధవుఁడు వరియించుభాతి,
ఘనయశోనిధి, శేషన్న గౌఁడుగారు
ప్రేమఁ జిన్నమ్మ సాధ్వినిఁ బెండ్లియాడె॥ 3

గీ॥ పేరు చిన్నమ్మయే గాని గౌరవమున,
బంధు మర్యాదలను; దైవభక్తి, విబుధ
పాద సంసేవనమున, నప్పటి వధూటు
లద్దిరే! యన గుణముఁ బెద్దయయ్యె॥ 4

గీ॥ సాధ్వి చిన్నమ్మసేయు పూజాఫలమ్ము,
ధన్యతముఁడగు శేషన్న దాన ఫలము;
క్రమముగాఁ బరిపక్వమా కతన సుతుల
వడసి రాజ్వర షట్చక్రవర్తి సముల॥ 5

సీ॥ శివపాదపద్మసంసేవ మార్కండేయుఁ
డనఁదగువాఁడు కేశన్న గౌఁడు
సిరిసంపదల సుంతకొఱఁత లేనికుబేరుఁ
డనఁదగు పెద్దనాగప్ప గౌఁడు
దేవతాబ్రాహ్మణాతిథి పూజలనుపేరు
వందిన చిన్ననాగప్ప గౌఁడు

అఖిలపురాణరహస్యార్థవేదిన్
యలరారు పెద్దయల్లప్పగారు

గీ॥ మందహాసముఖాంభోజసుందరుండు,
గొప్పమేధావి, నడిపియల్లప్పగారు,
పుణ్యములరాసి, కర్నూలుపురనివాసి
యతనికతఁడీడు, చిన్నయల్లప్పగారు 6

ఉ॥ ఇమ్ముగఁజుట్టపక్కముల కేని,తదన్యుల కేనిసుంతయో
పమ్మునుగల్గనీదు, పతిపల్కినపల్కునుమీఱఁబోదు. భా
గ్యమ్మధికమ్మటంచు మదిగర్వముఁబూనదు, పెద్దభార్యసౌ
గమ్ము: మహాసుపర్వులకుఁగల్పతరు ప్రసవమ్ము చూడఁగన్ 7

ఉ॥ నమ్మినభక్తినెప్పుడుమనమ్మున శ్రద్ధవహించి సర్వభా
గ్యమ్ము మహేశ్వరార్పణముగానిడు, భర్తకు దోసిలొగ్గుచున్,
సమ్మతిదైవకార్యములసల్పుగుణాలయ, చిన్నభార్య చెం
చమ్మ, నగాత్మజాచరణ సారసషట్పదమైనుతింగనన్। 8

సీ॥ ఇరువురుభార్యలందరు మఱనెఱుఁగని
కరుణాసుధావృష్టిఁ గురియువాఁడు
పండితులెచటఁ గన్పడినఁ గేల్గవమోడ్చి
మిక్కిలిభక్తితోఁ మ్రొక్కువాఁడు
కాశీగయాప్రయాగశ్రీనగాదిపు
ణ్యక్షేత్రములఁగాంచినట్టివాఁడు
కన్నబిడ్డలకన్నమిన్నగాఁదనగుమా
స్తాలకష్టసుఖాలఁదలఁచువాఁడు

గీ॥ బంధుగులలోన మంచిపేరందినాఁడు
కాశికావిశ్వనాథ పత్కజయుగళ

మత్తమధుపాయమాన సన్మానసుండు;
గొప్పధనికుండు, చిన్నయల్లప్పగాఁడు॥ 9

గీ॥ తంగెడంచపురంబునఁదనకుఁగలుగు
భూములందెల్లనుత్తమభూమినరసి
యతివిశాలంబుగా శంకరాలయంబు
మంచివసతులతోడఁగట్టించి, యందు॥ 10

సీ॥ భోగులై యున్నతోద్యోగులై నిరుపమ
త్యాగులై యలరు బాంధవులతోడఁ
గురువులై యాగమతరువులై మతిదేవ
గురువులై వెలయుభూసురులతోడఁ
హృద్యమై బ్రహ్మాండభేద్యమై శ్రవణసు
ఖాఁసాద్యవివిధవాద్యములతోడ
సారమై షడ్రసాధారమై నవసుధా
సారమై తనరు భోజనముతోడ

గీ॥ సర్వతజ్జినుమాఘకృష్ణమునఁ; దదియ
శుక్రవారమునందు, విశుద్ధవృషభ
లగ్నమున; శాస్త్రవిధినిఁ జెలంగె నార
కాశికావిశ్వనాధులింగప్రతిష్ఠ॥ 11

సీ॥ అన్నపూర్ణా విశాలాక్షీ వధూటులు
త్తమరీతి నింటిపెత్తనము సేయ
లోకత్రయముల నాలోకించి సూర్యుండు
పాపపుణ్యముల నేర్పాటు సేయ
శ్రీదేవిఁగూడి దామోదరుండా శ్రిత
జనకుటుంబముల రక్షణము సేయ
గణపతి యెట్టివిఘ్నములు రానీకయా
పన్నులకార్యముల్బాగుసేయ

గీ॥ నెప్రకుపయనంబొ? యనుచు నందీశ్వరుండు
ప్రమదమున వాకిటఁ బగుండి నెమరువేయ.
కాశికావిశ్వపతి భక్తగణముగొలువ
నిండు వేడుకఁగొలువయి యుండునిచట॥ 12

సీ॥ శివరాత్రినాఁడభిషేకంబుఁగావింపఁ
జనుదెంచు వైదిక సమితితోడ
అన్నపూర్ణావిశాలాక్షి మహేశ్వర
కల్యాణ మరయు భక్తతతితోడ
నాబాలగోపాల మభినుతింపంగ బా
జారులరుగు రథోత్సవముతోడ
సకల వర్ణములకు సంతుష్టిఁగావించు
షడ్రసోపేత భోజనముతోడ

గీ॥ గాయనీ గాయకుల హరికథలతోడ,
పరమ పురుషుల శివనామ భజనతోడ,
కార్యకర్తల సిద్ధసంకల్పమునను మీమ
జరుగు తిరునాల లోప మెచ్చటను లేక॥ 13

గీ॥ బావి పూలతోఁట, దేవప్రతిష్ఠ, కు
టుంబ పోషణము, ధనంబు భూమి.
శతకమందుకొనుట, సప్తసంతానముల్
బడయు టధికపుణ్యఫలముగాదె॥ 14

ఉ॥ ఎప్పుడు ధర్మకార్యముల నీవిధి సేయుచు, దిక్తటంబులన్
గొప్పయశంబుఁగాంచి; కడుగూరిమి బంధులు మిత్రకోటియున్
దప్పక సాయమున్నలుప: తగవు చెంచకఁగూడి చిన్నయ
ల్లప్ప సమస్త సౌఖ్యములనందునా; శ్రీపరమేశుసత్కృపన్ ॥ 15

# ★ ఛందోనియతి ★

సీ॥ అప్ప అయ్యన్న అరుసప్పఅమ్మక్క, అయియనుపదంబులమకు
సంధులు భయమునకుఁజెల్లుచుండు, నామూఖండవళులసంగ
నూదబడకన్నైన

ఉదా॥ వెం, కప్పకు దానమునవిర్భ యంబునసభలర్॥ చిన్నన్న కుమారుండు వెంగళామాత్యుఁడిలర్॥ నరసిం, గన్నకవిత్వంబుపద్య గద్యశ్రేణిర్॥ అప్పకవిఉభయవళులని పేరుపెట్టినాఁడేగాని, అఖండయతి ప్రాయ లేదు, ఉభయవళులకు దీనికిభేదములేదు అనిభయభిప్రాయము, ఆనందరంగరాట్ఛందము. తృతీయాశ్వాసము 110 పేజి, 80/ పద్యము అఖండయతి, భీమనఛందమున (సంజ్ఞాపరి) అఖండయతి, అప్పకవి తృతీ—153 పేజి, చూచినవిశదమగును, ఉ॥ మానుగవిశ్రమాక్షర సమన్వితమై, స్వరమూఁదినందదీయ్యాను గుణాక్షరంబెకొనినైనను జెప్పఁగవచ్చునీక్రియర్। భానుసహస్రభాసివృషభాధి పుఁడన్నటు లర్థయుక్తమై, పూనినచో నఖండయతి పాల్కురికనాదికవిప్రణీతమై॥ 308ప, ఉదా॥ బంధుజ, నావళిపురజనులుహస్తినా పురమునకుర్॥ భార, అశ్వమే॥ సుగ్గయిరుధిరమ్ములోమును గగ్రమ్మినయేనుఁగు పిండు, భార—ద్రోణ॥ సూవెమనంబుననుదలచుచుండుదు నేనుర్ భార- ఆది॥ విమ,లమతీనికొడుకునట్టులరయంగనగుర్ భార—ఉద్యో॥ ఇప్పుడు దొరకనిప్రబంధములను లోకమునకెఱుకసేయుటకు అందలియుదారణ ములనిచ్చుచున్నాము, ఉత్తమగండచ్ఛందమునందు॥ నసమాస నఖ సమాసము, లసమమ్ముగనచ్చుహల్లులర్ యతితగు —అల్లసాని పెద్దన్న హరికథాసారము-చలింపకననిలోనఁదెగియెనెవ్వఁడతఁడు,, !!ఏనియను పదమ్ముతోనాదిపదమూది, సంధినిత్యయుతులుజరుగురెంట ముక్కు తిమ్మన్నవాణీవిలాసము " తెలివాతలువానుగ్రచ్చులనినాయకుఁడు వశ్యుండగునెట్లంటే ,నాచనసోమునీహరివిలాసము ప్రియముగమంత్రం బుజెప్పినృపతికినెలమిర్॥ వాక్—కకుప్—దిక్—జగత్—మొదలైనశబ్ద ములుసంధియైరెండుహల్లులకు, జెల్లును, శ్వేతాశ్వ పంచవింశతి—

శా॥ చోరాగ్రాహ్యగజాంతకంబు, నలినీశుంభన్మదేభంబు; దిజ్నారీ మాక్తికదర్పణంబు రజనీకాంతామనోహారి, ॥— సాష్టాంగ—సాంబ— సాటోప—ద్వీప—నాక—అంతరీప—ఆలాప—సారంగ—వేదండ — వీవికుభ యము చెల్లును, నాచనహరివిలాసము—॥ సాంబశివాయంధకప్రశాసక॥ మనుచరిత—॥సాహంకారత శంకరుండలిగినేత్రాగ్నింబయింబంచినన్॥ పింగళిసూరన్న గిరిజాకల్యాణము—( దురాలాపము లాడుమనుబోయి రాసమయమునన్॥— సీ॥ రమ్యతరాది నారాయణవిగ్రహ హరివైణిక కలాలాపహృదయ॥ రెండవది: రెండేపి—అతడేని—ఉభయము చెల్లును, శ్రీనాథుని సునందనచరిత్రము— "రాజకుమారుఁడేలంగ గలడు,,— నన్నయభట్టు ఇంద్రవిజయము— నాలిక లిరుగన్న సీదిరవుత్రేఁడు,,— ఇట్లేరల—లడలకు చెల్లును॥— భీమకవి హరవిలాసము—ప్రాదియతులకు ఉభయము — ,,దురంతరసంసార వారిరాశియదివెరన్॥— అందే,, అధ్యవసాయంబెఱుక పరుప ( దగు సంప్రీతిన్॥— రంగనాథుని మిత్ర విందాపరిణయము— ,,వనమాలిగొలిచివ జనము వెందన్నన వాప్త కాములుగాని వారు పేరు॥ భీమకవినృసింహపురాణము— ,,సీ॥ నరనాథ యతనితానమ్ములచేత నవాప్తకాములుగాని యగ్రజన్ములు॥— ప్రాచీ నుల గ్రంథములు ముద్రణముగాకపోయినను ఆనందరంగరాట్ఛందము నందు చాలయుదాహరణము లీయబడినవి, అఖండయతికూడదని కొందరు వాదించినందున వీనినిక్కడవ్రాసితిమి;— మఱియు గీ॥ హల్లు తోఁగూడ నంధిగానవ్చు పొసఁగునహితులేలొక్క యీరీతి నలు కొనకొనర్చి,, భార—ద్రోణ॥ ,,ఇమ్మహాపతికితండేలొక్క॥ భార— విరా॥ జన్మములు సేయు నెడ... మిన్నకకినుకుడిగి పొమ్ము॥— గీ॥ఆగున స్త్రీలింగశబ్దంబుహ్రస్వముగ, సమాసమధ్యంబునను,,—గంగాజలము— నదీసుతుఁడు— నదిసుతుఁడు— తమసతీరము— రాఘవ పాండవీయము "కలతమసతీరసికతా విలసనములు,,— శృం నైషధం॥ రాకసుధాంశు మండలము,— సర్వలక్షణసారసంగ్రము— " సంస్కృతపదంబులొగి

సమాసములుగూర్చుకడల స్త్రీలింగములకు దీర్ఘములు కలుగుచులగును

మందు;:— అథర్వణభారతము "నదిసుతగురు కర్ణశల్యనాగపురీశుల్"॥— ఆముక్తమాల్యద॥ ధరణీధనదత్త వివిధౌషధా॥ మనుచరిత్ర—॥ అవుడుపరంధ్రివర్గవృతయై॥— కాళిదాసు॥ పురంధ్రిభిశ్చ క్రమశః ప్రయుక్తం॥ నైషధము॥ కనకక్షోణీధరంబుకార్ముకముగా॥ కొన్నివింతప్రయోగములు— ఇకారవికల్పసంధి॥ కాశీఖండము— మగనాలి సరిపోల్పదగదువిధవ- ఉత్తరామా—॥ ఆసమయమ్మునన్మ గనియాంధ్రు॥ "పురటాలికిబదిదినములు" భాగ॥ తామరసనేత్రవింజ్ఞ బండాలుగారి॥ మనుచరిత్ర॥ పెండ్లైనబాలదాసు॥ హరివంశము॥ వెండుంగురము॥ హార— ని॥ "వెల్లనుగుమీాదడీకొలిపి" పారిజాత॥ కం॥ కావింపుట, కావించుట భావింపుట మరియు దీనిభావించుటనక గావెలయుగృతుల॥ సర్వలక్షణసార॥ "భక్షించుచుదల్లిపంద్రి" హరవి చంచలత్వంబు మదిఃబ్రకాశించుచుండె॥ నైషధము. ద్వితీయావిభక్తికిబదులుప్రథమావిభక్తివాడ వచ్చును॥ అరదము నెక్కె కేతన॥ పారిజా॥ "పసిడిరథమెక్కె" కవికర్ణరసా॥ స్త్రీలింగములకునపుంసకలింగములు విశేషణములగును॥ "వరుణపురి సర్వలోకోత్తరము" సభాప॥ ఏలినది— చూచినది— అని యుండుటకుమారుగా ఏలింది ముసైన్యనపద్యములు ప్రబంధములందు చూపట్టుచున్నవి॥ కరినేలింది హుళక్కి, ద్రౌపదికికోకలైచ్చి యిచ్చింది దబ్బర చేపట్టింది॥ హంసవింశతిలో॥ సీనుగడెజ గేటస్తై తే॥ 2 ఆ128ప "వచుచ్చుబొయ్యేటి" 162ప "సారసమిత్రుడనేటి" 174వ కళల మీాదిద్రుతము సముచ్చయనకారము "పెంపునజమదగ్నిసూనుడును" భార—ఆది॥ మనమునదలపాసి యొకండును॥ విపంచివిన్న మొదలుగా నీవంటమింజేసి॥ మనుచరిత్ర॥ దానవకులమథన పెద్దతడవుల నుండిక బూని॥ ఉత్తరహరి॥ ఆధారము లేకను సంతానోచ్ఛేదంబున॥ భా—ఆది॥ తపమిట్టిదింగలదె॥ అప్పటింగలుమపథప్రవర్తనము॥ మొదలైనవిప్రౌఢ వ్యాకరణము 46 పేజిచూడుము.

శ్రీ ర స్తు

# శ్రీ కాశీవిశ్వనాథశతకము



శా॥ శ్రీవాణీశ గణేశ పద్మహిత లక్ష్మీశాంబికా భద్రకా
ళీ వీరేశ–కుమార భక్తజనపాళిన్; దేశికశ్రేణి, నా 1
నావిద్వత్కవులన్నుతించి, పరమానందంబుతో నిను వా
క్సేవం జేతుము; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ!॥–

మ॥ శతకంబుల్శతకోటికెక్కుడుగ యుష్మత్పాదపద్మంబులన్
మతిమంతుల్విరచించి యుంచిరిదియే మాత్రంబులే; యైనసం
తతముంజంద్రునిఁదాల్చు నీవితరపుష్పశ్రేణిఁగై సేయ రో
సితివా? శంకర! తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ!॥ 2

శా॥ తప్పుల్లేవని, యొప్పులున్నవని వాదంబేల? విద్వత్కవుల్
దప్పుల్చూపిన దిద్దుకోఁగలము, మోదంబందుమిత్రాళికిం
గుప్పల్తెప్పలు మున్నమస్కృతులు; నీకుందీనినర్పించుటం
జెప్పం జేనికి? తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ!॥ 3

మ॥ ఉరుకష్టాంబుధిదాటు యోజనలుసేయున్మిత్రుఁడై; కోపియై
పరుషాలాపములాడు; భక్తుఁడయిసంప్రార్థించు; నర్థార్థియై
తరముల్దాక ధనంబుఁగోరు కవి; స్వాతంత్ర్యంబునీయందు సు
స్థిరమైయుండుటఁ; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 4

మ॥ హృదయక్షేత్రమునందు సద్గురుకృపావృష్టిన్సకాలంబు నం
దెదబెట్టంబడె మంత్రబీజములు; నేఁడేపంటకున్వచ్చె; దు
ర్మదవాంఛా విహంగాళివ్రాలినవి; పాఱందోలి, సౌభాగ్యమి
చ్చి దయంజూడుము; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥– 5

మ॥ భ్రమచేనీపదపద్మముల్విడచి, రాట్పూలాశనిర్గంధ పు
ష్పములంజేరి, వృథాశ్రమన్గనినియు నాశంజెందునస్మన్మనో
భ్రమరంబున్దయఁజూచి మోక్షమధుధారాతృప్తినొందించినన్
స్థిమితంబౌగద, తంగెండచపుర కాశీవిశ్వనాథప్రభూ!॥– 6

మ॥ మరహంకారముచేత నల్దిశలఁగంతుల్వేయు నాబుద్ధి వా
నరమై; తావకభక్తిసూత్రములనైనన్దీనిబంధించి, నీ
చరణాంభోరుహపూజనేర్పవలెఁ: ద్వత్సాన్నిధ్యమందైన సు
స్థిరతన్నిల్చును; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥— 7

మ॥ శివపంచాక్షరిమంత్ర రాజజపముఁ జేయంగఁ గన్మూసినన్
ద్రవిణంబుల్; సుతమిత్రబంధుజన కాంతారత్నముల్వచ్చి క
న్గవముందుందురు; చిత్తమొందఁగునో, కాంచంగనాశక్యమే ?
శివ! నీరూపముఁ; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ!॥— 8

శా॥ సారంగాసురహారి! పర్వతతనూజామానసాబ్జాటవీ
సారంగప్రతిభావిహారి! మునిరాట్సంతోషకారీ! సుహృ
త్సారంగాఘ ఘనాంబుధారి! విలసత్సారంగధారీ! ననుం
జేరంగాఁగదె; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ!॥— 9

శా॥ గంధర్వాసుర నిర్జరప్రమథలోక శ్రేణిసేవింప; గో
గంధర్వంబునలంకరించి; జగమున్గాపాడునీ వేటికా
గంధర్వావళితో శ్మశానభువి సౌఖ్యంబంచుఁగొల్వుందువో
సిందూరాంబక! తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥— 10

మ॥ శిలలో దేవ్వుఁడు " లేఁడులేఁడ " నుచుఁజర్చింపంగనేల ? మహా
త్ములు కష్టించిరి, నిన్నుఁగన్గొనిరి, సంతోషించిరారీతిగా
సలుపంజాలక, భక్తిలేకుచిత సాక్షాత్కారముం గోరినన్
శిలవై యుందువు, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥— 11

శా॥ ఎంచన్ఘోరవిపత్తునందొకఁడు; నీవెందుంగనన్ రావు లే
వంచు న్వాదనసేయునొక్కఁడుఁడు; భోగైశ్వర్యముల్గోరి కా
వించున్దివ్యతపంబొకండు; సరిగావీక్షించి భక్తాళి ర
క్షించంజాలిన తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥— 12

మ॥ జననంబందిన దానికిన్ఫలము యుష్మత్సేవలన్సల్పుచున్;
ధనమార్జించినదానికిన్ఫలము సద్ధర్మంబుఁగావింపుచున్
తనయుల్పుట్టినదానికిన్ఫలము విద్వత్పాదశుశ్రూషఁజే
సిననేమోక్షము తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥- 13

మ॥ శివపంచాక్షరమంత్రరాజజపమున్; శ్రీశైవపుణ్యస్థలిన్
శివరాత్రిన్శివలింగదర్శనము; కాశీవాసము. న్బిల్వప
ల్లవముల్నీచరణంబులందిడుటయున్ లాభాళిఁజేకూర్పుమో
శివ! గౌరీధవ! తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 14

మ॥ దురితాంభోధిఁదరించుకోరిక శిలాదుండెన్నియోదివ్య వ
త్సరముల్నీజపమాచరింపఁగ; నివాసంబుంటివౌరౌర! త
చ్ఛిరమందే, భ్రమరాంబికాయుతుడవై శ్రీశైలమల్లేశ సు
స్థిరనామంబునఁ దంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥- 15

శా॥ నందీశుండు భవత్పదాబ్జముల నానందంబుతోఁగొల్వఁగా
డెందంబందుదలంచి, నిన్నటఁబ్రతిష్ఠింపంగదా శ్రీమహా
నందిక్షేత్రమువాసిగాంచె, సుజనుల్నాఁడాదిగామోక్షము
న్జెందంగల్గిరి తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥- 16

మ॥ ఎవఁడోయొక్కఁడు పుణ్యపూరుషుఁడు నిన్నీరీతిసేవించి నీ
భవనంబందొకలింగమున్నిలుప, నీప్రాగల్భ్యముంజేసి యీ
భువిలోదానికిఁగీర్తివచ్చు: నదియేపుణ్యస్థలంబౌను, నీ
శివలోకంబిదు తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥- 17

## ఈ స్థల భోగము

మ॥ ఇదిచేనాగద, పెద్దవారెవరుగానీ యిట్టిపుణ్యస్థలం
బిదికాఁబోవునటంచుఁజెప్పిరె? భవానీశుండ వీవుంటచేఁ

గద, యీాయాలయమంట పాద్యాఖిలసౌకర్యంబులొప్పారె, మె
చ్చెద నీప్రజ్ఞను తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥— 18

శా॥ చేనై ధాన్యముబండి రైతులనురక్షించెన్; మహేశా! త్వదా
స్థానంబై నిజభక్తరత్నముల సంసారాబ్ధిదాటించి మో
క్షానందంబిడఁ గారణంబయిన పుణ్యక్షేత్రమయ్యెన్; న్సమీ
చీనంబియ్యది తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥— 19

శా॥ ద్వారంబందలి రాతికెల్లపుడు పాదస్పర్శయయ్యెన్: దేవతా
గారంబందలి రాతిబొమ్మకు నమస్కారంబు పుష్పార్చనం
బీరెండున్నిలలే; యదృష్టమటులయ్యె; న్నేటికిన్ మీ నీ
చేరాజిల్లెను, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥— 20

మ॥ సిరినింపారెడు తంగెడంచపురి కాశీక్షేత్రమై; గోస్తనీ
వరపీయూష రసోపమానవిమలాంభః పూరమౌ బావి భూ
సుర గంగానదియై; మహోత్సవములన్శోభిల్లి వర్ధిల్లుతం
జిరకాలంబిది, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥— 21

## శివతీర్థము అను పేరుగల క్రొత్తబావి

మ॥ ధర నేనాఁడొ తటాకమున్నిలిపి, యింద్రద్యుమ్న భూమీశుఁడా
సురలోకంబున నేఁటికుండెనఁట; యీశున్నిప్రతిష్ఠించి, యీ
వరసన్నిర్మల వారిసంభరితకూపస్థాపన; స్వేరికిన్
స్థిరమోక్షంబగుఁ తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥— 22

మ॥ నడిఎండన్బడి వచ్చుపాంథునకుఁ దృష్ణాశాంతిఁ గావింపఁ జెం
బెడు నీరిచ్చినఁబుణ్యమందురుగదా; విశ్రాంతిలేకుండ నె
ప్పుడుతోఁ్రివంజనువారు నీరుగొని సమ్మోదంబునందంగ వ
చ్చెడుకైలాసము తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥— 23

మ॥ శివరాత్రిన్భవదీయసన్నిధికి: నా(శ్రీ)శైలమల్లేశు ను
త్సవముంజూడఁగ; నెండలోఁజనెడు పాంథశ్రేణి విశ్రాంతిగా
నవపుండ్రేక్షురసాంబు పానమున నానందింతు రే వేళనీ
శివతీర్థంబునఁ, దంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥— 24

మ॥ అమితానందముతోడ భక్తులు మహాన్యాసంపురుద్రాభిషే
కముఁజేయంగను, బావిలోనదిగి గంగందెచ్చినీదివ్య లిం
గముపైఁబోసి "నమోనమోహర" యనంగా, మోక్షలక్ష్మీమన
స్థిమితంబయ్యెడు, దంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 25

## పూలతోఁట

మ॥ ఒకమారేడుదళంబు నీపదములందుంచంగ సంతోషివై
యకలంకంబగు మోక్షమిత్తువఁట, పుష్పారామముం బెంచి, మా
లికలంగూర్చి సహస్రనామముల పాలింగొల్చు నీపుణ్యరా
శికినేమిచ్చెదొ? దంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 26

మ॥ ఒకచోమల్లెలు సన్నజాజు, లొకచో నొప్పారు గన్నేరు వృ
క్షకదంబం, బొక వేదికాస్థలినినశ్వత్థంబు, బిల్వంబు, వే
రొకచో నామలకాదిభూజములు, విధ్యుక్తంబుగానాటి మ
చ్చికతోఁబెంచిరి, దంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 27

మ॥ ఘనకాంతార తరుప్రసూనములు తత్కాంతారమందే నసిం
చును; పూఁబోణులఁజేరి వాల్జడలపైశోభిల్లు, బుణ్యంబొన
ర్చిన పుష్పావళి తావకీనపద రాజీవంబులంజేరి వా
సినిగాంచుక; శివ! దంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 28

మ॥ అకలంకంబగుభక్తి నీచరణసేవాసక్తి వల్మీకమృ
త్తికచే లింగముఁజేసి నిత్యము "నమస్తేరుద్ర" యన్దివ్యవై

దికమంత్రింబుల ధూపదీపములనర్థిం గొల్చునప్పుణ్యారాం
శికిమోక్షంబిడు, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 29

మ॥ అనలంబందున నిన్భజించెదరు స్వాహాకారముంజెప్పి; రా
తిని సేవింతురు పాలు నెయ్యి పెరుగుం దేనెన్సమర్పించి: బొ
మ్మనుపూజింతురు పూలుపత్రినిడి; సామాన్యంబుగా నెట్లోన
ర్పినరక్షించెదు; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 30

శా॥ పూలుంబత్రిరితో దినాంతముననిన్పూజింపఁ: గృష్ణుండు మో
కాలింజూపినఁబూజజేసి, కరయుగ్మంబెత్తి ప్రార్థింప; మో
కాలే నీవయిభీమసేనునకు విజ్ఞానంబుతోడన్జయ
శ్రీలర్పించిన తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 31

శా॥ "నింజెన్వానికి షోడశాబ్దములురండీ! పట్టితెండంచుఁగా
లుండేతెంచిన భీతచిత్తుఁడయియాలోకింప; విచ్చేసి మా
ర్కండేయుణ్ స్థిరజీవిఁజేసితివి; శక్యంబౌనె? నీవారిపై
జెండానెత్తఁగ తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 32

మ॥ చిఱుతొండండను శైవభక్తునిఁబరీక్షింపంగఁ దత్పుత్రకుణ్
శిరముఖండనఁజేసివండుమని; భక్షింపంగనాబంతిలోఁ
జిఱుతండేడి; యనంగుమారకునిః దాఁజీరంగ రక్షింపవా?
సిరియాళున్నివ! తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 33

శా॥ బావా మల్లనగార లక్క భ్రమరాంబా; పుత్రులంగూడి దీ
పావళ్యుత్సవమంచు బాలునిగృహంబందుండి హాస్యోక్తులణ్
సేవల్గాంచుభుజించుటా, యెవనికేన్సిద్ధించునా? యిట్టినీ
శ్రీవాత్సల్యము; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 34

మ॥ పతివై గాఢసతీమణిన్ రతికిసంప్రార్థించి, యొప్పించి త
త్పతిరాఁగా, భయమందియచ్చట సురాభాండంబునన్ డాఁగి, వా
రతిభక్తిన్ వినుతింప· నేమెఱుఁగనట్లుం దేగి మోక్షంబు ని
చ్చితివౌరా! బళి! తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 35

శా॥ మారాజ్యంబున లంచగొండితనము న్మాయింపయత్నించుచు
న్నారే; ప్రార్థునలేచుటాది తమచెంతన్ లంచమున్బట్టి వ్యా
పారంబే కనవచ్చుచున్నయది, మీపై శిక్షకుల్లేరుగా?
శ్రీరాజార్చిత? తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 36

మ॥ హరి నిత్యంబు సహస్రపద్మముల నిన్నర్చించియర్చించి, వే
సరి, నేత్రాబ్జముఁదీసి నీకొసఁగెలంచంబంత నీవిచ్చి తా
పరరాత్రించర ఘోరనిర్దళనశుంభద్విక్రమాటోప సు
స్థిరచక్రింబును, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 37

మ॥ జలమా పుక్కిటఁబట్టి తెచ్చినది, మాంసంబన్నఁదాఁదిన్న యెం
గిలి, మంత్రంబుహుళిక్కి, నీపయినభక్తిన్ బోయసేవింపఁ; గ
న్నులు రెండున్నకలించి పుచ్చుకొని సంతోషంబు జేకూర్చితౌ
శిల నీచిత్తము తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 38

మ॥ మనసారన్నినుగొల్చునర్జునుఁడె; నీమాయాకిరాతాకృతిం
గని "యీవేషములింకవేయక" నుచున్గాండీవసంతాడనం
బున శీర్షంబగలించి; పాశుపతసంపూర్ణప్రభావంబు గాం
చెను; దీనావన! తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 39

శా॥ కోపంబేతనపాలిశత్రువయి యెగ్గుంగూర్చు; నత్యంత సం
తాపంబు, న్గడుపాపము,న్నరకముల్ దారిద్ర్యముల్ దుష్క్రియా
వ్యాపారంబు, ఘటించు నట్టి, ఖలుఁడెవ్వండైనఁబోనీక యా
క్షేపింపంగల తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 40

శా॥ దక్షుండాదిమభక్తుఁడైయొసఁగె శ్రీదాక్షాయణిఁ; న్నిన్నుఁదా
నాక్షేపింపఁగ మామగారనక సైన్యంబంపి యుగ్రాకృతిం
గక్షంగట్టి శిరంబుద్రుంచితివి; లెక్కంజేతువే? యన్యులన్
శిక్షింపంగను తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 41

మ॥ వనముల్వేరొకచోటలేవె? హిమవత్ప్రాంతంబునందే తపం
బునకుంగారణమేమి; శైలతనయామోహంబునంగాదె; మి
మ్మనుగూర్పంజనుదెంచు మన్మథునితప్పుంబట్టి భస్మంబుజే
సిన రుద్రుండవు; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 42

శా॥ వ్యాసుండంతటివాఁడు, భిక్షకయిమధ్యాహ్నంబునందేగియున్
గాసింబెక్కడలేక, కాశిపయిరౌద్రంబూనిదూషింప; స
న్యాసీ! పొమ్మనినావు; కోపిమెటులందంజాలు నీమోక్షల
క్ష్మీసామ్రాజ్యము; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 43

మ॥ సతముంగోటిశివాలయంబులను గాంచంబోయె; శీర్షంబులం
చితభక్తిందెగఁగోసి పూజలొనరించెన్; రావణుండైన; గ
ర్వితుఁడంచున్ రజతాద్రిక్రిందనిడి నీవేత్రొక్కిబాధించితా
శ్రితసంరక్షక! తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 44

మ॥ వరముల్గోరఁగవచ్చునెన్నయిన; గర్వగ్రంధి బాణాసురుం
డరరే! మిమ్ముఁబురాణదంపతులనే, ద్వారంబునందుంచ ద
ద్దురితంబేది, సహస్రబాహువులనిం; ద్రుంపంబడెన్శౌరిచే;
స్థిరమోక్షప్రద! తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 45

---

45 పద్య:— ద్వారశబ్దమునకు, ద్వౌఅరేపార్శ్వేయస్యతత్ ద్వారం, "పృషోదరాదీనియథోపదిష్టం" ఇతిసూత్రేణద్విశబ్దాంతస్య ఇకారలోపః, ఆకారాదేశః ఉదా॥ ద్వారవిహారులై సిరుల నందక నందక పాణిగొల్వరో॥ (2) ద్వారనికాయమైన నిజపట్టణము" అప్పకవీయము. 8 ఆశ్వా.

శా॥ ఏనాఁడైనను పక్షపాతమును మాకేలేదు, నీకైన; భ
క్తానీకంబనఁ బ్రేమయొక్కవనిజంబానాఁడు భస్మాసురుం
డేనీనెత్తినఁ జేయివెట్ట హరిరానేలా? వధింపంగనీ
చేనేపాటిది, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 46

శా॥ తానే పెంచిన చెట్టు చెడ్డదయినం దాఁ గొట్టలేఁ డెవ్వఁడ
ట్లో నీసేవకులైన దైత్యులకు నీవే గోర్కెలీడేర్చుచున్;
మానింద్రాళికి వారు బాధలిడఁ ద్రుంపం జేతువా విష్ణుచే
శ్రీనిత్యోత్సవ! తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 47

శా॥ రారాజుం గురు యోధరాజి యపకారంబేమి కావించిరో?
శౌరీంద్రాత్మజధర్మనందనులు లంచంబేమి నీకిచ్చిరో?
ఘోరాజిన్నరు తేరముందరిగి చేకూర్పంగ లేదే జయ
శ్రీ రాజ్యంబును తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 48

శా॥ లక్ష్మ్యార్థప్రయత్నమున్నలిపికాలక్షేపముం జేయుచున్
లక్ష్మింపందునరుండు, నిన్నతఁడెఱబో; లక్షాధిపుండౌను; నిన్
దీక్షంబూని జపించునాతఁడకటా! దీనుండగు న్భక్తులన్
శిక్షంజేసెదు, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 49

మ॥ తొలుతం బెండిలి, భార్యవచ్చుటను సంతోషంబు, వెన్వెంటఁబు
త్రులు పుత్రీతతి, వారికిం బరిణయాదుల్బంధుమర్యాదలన్
జలధిన్మగ్నుచుఁ దేలుచుం దరినిగాంచం బోవఁడజ్ఞాని: నె
చ్చెలివై బ్రోవుము, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 50

శా॥ ఆశావృక్షము, భూమిలోఁ బోడమి యాశాంతంబులన్నిండి యా
కాశంబంటెడు వేళఁ; బద్మభవు సంకల్పద్రుమంబడ్డమై
నాశంబందఁగఁ జేయు, నింక ఫలవంతం బెట్టు తా, విఘ్నని
శ్శేషంబేగద, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 51

మ॥ గళమందున్న మహావిషంబు సగభాగంబెత్తి, నేత్రాగ్నికి
లలకొల్పింగ అగించి; మోహామదలోలత్వంబులన్గల్పి; మా

యలరంగుల్బయిపూఁతఁబూసి: విషకన్యన్సల్పి, తచ్చిత్రముఁ
శిలగాఁజేసిన తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 52

మ॥ అమృతాంభోనిధిరీతినుండు విషకన్యానామ మాయాకురం
గములంగన్గొని, డాయఁబోయి, తెలియంగాలేకమాటాడినన్
శ్రమయబ్లుండఁగ, లేనినిందఁదలపై నన్వేతురిప్పి! మన
స్థిమితంబుండదు, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 53

మ॥ సినిమావచ్చెను పూర్వనాట్యకళలన్ ఛేదింప; నాచారదీ
క్షనుగంగానదిఁద్రోయఁగాఫి బొడమెం. గాంతాళి వేషంబుది
ద్దనువిచ్చేసె విదేశవస్తువులు, నీధర్మప్రచారంబుఁ జే
సిననేమున్నది; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 54

మ॥ హరిదాసో, మఱిగాయకుండో, కవియో, యన్యుండో. శ్రద్ధాళువై
గురువై కాంతకువిద్యనేర్పుతరి, లోకుల్కాకులై వారికి
ర్వారకేదో యొకనిందమోపెదరు; పాపుల్సత్యమూహింతురే?
చెరుపంబెద్దలు, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 55

మ॥ సిరిలేకుండినఁ; జేసుకున్నపతిమ్లేచ్ఛాచారతుండైన, దు
ర్భరకష్టంబులు నెత్తిపైఁబడిన; నాపత్కాలమున్డైన, సుం
దరికేదో యొక విద్యయున్న ఫలవంతంబౌను దారిద్ర్యపుం
జెఱలోఁజిక్కదు తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 56

శా॥ ఆరంభించినఁజెప్పఁగాగల దుపన్యాసంబు నట్టింట; నా
నారాగంబుల వేయికీర్తనలనైనం బాడు దా దొడ్డిలో,
నారీరత్నము బీదకాపురమునం జేయు, నెందేసభం
జేరన్సిగ్గిలు తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 57

మ॥ హరిగాథల్వాచియింపరో, సభనుపన్యాసంబులం జెప్పరో,
సరసంబైనకవిత్వమల్లరో, ప్రశంసాపత్రముల్పొందరో,

తరుణులుర్వార్భవము; నేఁటికాంతలకు బాతాఖాని పాండిత్యమే
స్థిరమైనిల్చెను; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 58

శా॥ కుప్పల్గోసిరి మేనిసొమ్ములను సంకోచంబు లేకుండ; నే
తిప్పల్బెట్టిన సైచియుండిరి, ప్రశాంతిన్ గాంధితాతయ్యచే
మెప్పుంబొందిరి, భారతీయసతు; లార్మిన్వీరితో నన్యులం
జెప్పంగూడునె? తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 59

మ॥ పతియుద్యోగము జేసి కష్టపడిసంపాదింప, దానింటిలో
సుతలోకంబును సృష్టిసేయుటకుఁజూచున్; భర్తతన్వీడినన్
గతిఏమున్నది? విద్యయున్న బ్రతుకంగావచ్చుఁ దత్తద్వయో
చితవేషంబునఁ; దంగెడంచడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 60

మ॥ చెలిచిత్తంబును దోసకాయగతిగా ఛేదించి బాగోగులం
దెలియంగావశమా నె? పైమెఱుగులన్; దీవ్యత్సుధాధోరణిన్
వెలినవ్వంగని నమ్మి చెంతకరుగన్ వారొందుగామారి, గా
సిలఁజేయున్నరుఁ దంగెడంచడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 61

మ॥ కలిరాజేంద్రునిమంత్రిపుంగవులు, బంగారంబు, మద్యంబు, కాం
తలు, కాఫీరసమెంతవాఁడయినఁ జేతంబట్టియేలీరు, ని
శ్చలభక్తివ్రతదాన మంత్రజపపూజాధ్యానవిఘ్నంబు; లీ
సిలుగుల్బాపవె తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 62

మ॥ కలమాన్నంబు ఘృతంబు పాయసము శాకవ్రాతముక పిండివం
టలు నైవేద్యముసేయ యోగ్యమగు; దుష్టంబైనయీపొట్టలో
పలఁజేరంగన మేధ్యమైచెడెడి, యీపాపంపు దేహంబులోఁ
జెలువంబెచ్చట? తంగెడఁచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 63

శా॥ బాల్యంబాదిగ భక్ష్యభోజ్యములమేపస్మేసి, గంధాదులన్
మాల్యంబుల్గయిసేసి, వార్ధకములురా మాంసంబురక్తంబువై

కల్యాంబూను, దశేంద్రియంబులు జెడుంగాన్ శరీరంపుసా
శీల్యంబిట్టిది, తంగెడుంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 64

మ॥ తెలుపుల్మాసినపంజరంబున శకుతంబుంటకష్టంబుగా
నలరుం బొమ్మిదిద్వారముల్దెరచి, దేహాగారమందెట్టులన్
బళి! జీవేశ్వరపక్షియుగ్మమును బెంపంజాలితో, వానితోఁ
జెలిమిం జేసితో; తంగెడంచడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 65

శా॥ తా నెన్నెసల్పిన పట్టుకాయకొకరంధ్రంబుంచకద్దానిలో
నే నాశంబగు పట్టుపుర్వువలె; దానేసంస్మృతింబెంచి య
జ్ఞానాంధుండగు జీవుఁడంతమయి నానాయోనులంబుట్టప్రా
చీనాఘంబునఁ దంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 66

శా॥ తానేదారముతీయు నల్లునికవస్త్రంబందులోనుండు; న
ద్దానిందా హరియించు సాలెపురువే; తద్రీతిగా నీశుఁడున్
నానాలోకములన్ సృజించు మనుచున్నాశంబుసేయున్నమీ
చీనంబీపని, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 67

మ॥ జననంబందినదాదిపుణ్యములు ఱక్కల్సల్పి, స్వర్లోకముం
గనిన్, జన్మమునెత్తి తీరవలయుం, గష్టించిపండించియున్
దినముస్నేద్యముసేయు కర్షకునిరీతింగాన సాయుజ్యల
క్ష్మీనిఁబొందందగుఁ దంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 68

మ॥ ధరసన్యాసికి మోక్షమంచుపనిషత్తాత్పర్యముంజూపి, శం
కరుఁడున్శిష్యులుసన్యసించిరి; టులంగాకుండవ్యాసుండుముం
దరఁ బెండ్లాడఁగఁగన్నపుత్రునకు బోధంజేసె; నీరెంటిలో
స్థిరమానెయ్యది? తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 69

మ॥ బలవంతంబుగ నింద్రియాశ్వములనిర్బంధించి, మెల్లప్పుడుం
గలిమింబొంగక లేమిఁగ్రుంగక, యహంకారంబుబోనాడి ని

శ్చలచిత్తుండగువాఁడు, యోగియయినస్సంసారియైనన్నరే
చెలఁగున్మోక్షము, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్ర! 70

శా॥ జీవుండీశ్వరుఁడంచు సద్గురువుచర్చింపంగ వేదాంతస
ద్భావంబజ్ఞుఁడెఱుంగఁడంచు బయలే బ్రహ్మంబు, స త్యం బు గా
నీకై దీనినెఱుంగుటేమెఱుక, యందే మోక్షసామ్రాజ్యల
క్ష్మీవాసం,, బని తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 71

మ॥ చలమీవిశ్వమునాశమౌ; యచలమేసత్యంబుబ్రహ్మంబు, ని
శ్చలతత్త్వంబు నెఱుంగుటేమెఱుక, సంసారంబునందుండి క
ర్మల గావింపుము వానికిన్ఫలముగోరంబోనిచో మోక్షల
క్ష్మిలభించుంగద, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 72

మ॥ జనకుండున్, శుకుఁడున్, వశిష్ఠుఁడును, భీష్మాచార్యుడుంకృష్ణుఁడున్
మనవారెందరో నేఁటికీయచలసామ్రాజ్యంబుపాలింపుచున్;
ఘనసంసార సుధాతరంగిణులసౌఖ్యంబొందుచు, న్మోక్షల
క్ష్మినిగై సేసిరి తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 73

మ॥ అనఘుల్మౌనులు, బ్రహ్మవిష్ణువులుమాయామేయసంసారవా
ర్ధినిదాటంగనశక్తులైరి; జనులెంతేనజ్ఞులీమోహబం
ధనముల్ద్రెంచఁగ లేరు. వీరలకుసన్న్యాసంబుమేలంచు జే
సినసంకల్పము తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 74

మ॥ సరిగాబౌద్ధుల యుద్ధతింజెఱుపఁగాసంకల్పముంజేసి, శం
కరుఁడన్స్వైరజనించి, భాష్యములసంఖ్యాకంబుగావించి, సం
సరణాంభోధితరింపనీయుపని షత్సారప్రచారంబుచేఁ
జరకర్తింగనె తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 75

మ॥ ధరణిన్ధర్మవినాశనంబయినఁ దద్ధర్మంబురక్షింపనే
నరుదెంచంగల, నంచునీవనవాక్యంబంతలోనేమదిన్

మరువంగా(దగునయ్యా! మా వెతలుమాన్పం(దీర లేదయ్యా! నే
చెరలోనుంటివి? తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 76

మ॥ తల(పం రాదుస్వజాతిధర్మములు; సంధ్యావందనం బేటిలో(
గలిసెం; దానజపాగ్నిహోత్రములకుంగాలూన(దా వెక్కడే
న్గలదా? వైదికకర్మలన్న, సురలోకంబన్న నిందించుటల్
జెలరేగెన్భువి; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 77

శా॥ "సాలగ్రామఖనింజనించునుగదా జాత్యల్పపాషాణ" మల్
లీలన్వేదపురాణశాస్త్రములు కేళిం దేలువారింట(జో
క్యాలంజెప్పులపీడకన్నముదినంగా( బుత్రకుల్నేర్చి త
చ్ఛీలంబూడ్చిరి తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 78

శా॥ చేరెన్మీసలు ముక్కుబొక్కలకడం, శీర్షంబుప్పె(రెబెన్నెఱుల్
మారెన్గడ్డలగూళ్ళకై వడి, ముసల్మాన్వేషముల్మీఱ జే
కూరెం దాస్యముపొట్టకూటికయి, మాం మో; మేనా(టికో!
శ్రీరాజావన! తంగెడంచపుర కాశీవిశ్వకునాథప్రభూ॥ 79

మ॥ పగలుం రాత్రియుభూమిదున్ని పయిగుంబండించి, కష్టార్జితం
బగునాతిండిదినంగరైతునకు లేదయ్యెన్స్వతంత్రంబు: తే
సగభాగంబు:: నికొ౩చొందురికరేపం పాపులో(గాలిడం
సిగపట్లేకద? తంగెడంచపుర కాశీవిశ్యనాథప్రభూ॥ 80

శా॥ కాలుండిచ్చునుదున్నపో(తు, నొకవంకన్నివృషంబుండె, నే
వేళన్గంగసమృద్ధి: విత్తనములిప్పించుంకుబేరుండు, నా
గేలిం శ్రీబలరాము(డిచ్చు(; గృషినీకేచేతనా; మాకుధా
న్యాళింబంపుము కేపనింగుశ్రమబాయంజేయుమాతండ్రి! జే
జేలర్పింతుము తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 81

శా॥ పేరుం వ్రాయుటకొక్కరోజు,జనులన్వీక్షింప(గావచ్చునై
దోరోజచ్చుటికే: కేగ(బొమ్మనుట యెంతోదీను(డై వే(డ(గా

శారమ్మంచును జీటికిచ్చుటకువారంబక్కటా! దీనులం
జేరందీయుము తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 82

శా॥ భిక్షంబెత్తినసీవెఱుంగవ? భువిన్భిక్షాటకుల్ నేఁడుకా
లక్షేపంబెట్లుసేయఁగావలయునో. లక్ష్మాధిపుండై నఁదా
భిక్షంబీయఁడురేపఁటంచనుచు, నీపేరింకలేకుండవే
శిక్షింపంగదె తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 83

మ॥ కలముఁ జేకొని యాణిముత్తెములవీకన్వ్రాతు, రుద్యోగముల్
సలుపన్నేర్తురు, యుద్ధమందురిపులంజక్కాడనుంకింతు, రీ
చెలువన్నేర్వఁగరానివిద్యగలదా? చెప్పించువారుండినన్
శిలలావారలు, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 84

మ॥ అకటా! ముప్పదియేండ్లుదాటిన వివాహంబాడుభాగ్యంబులే
దిఁకెఁ సూభారతసోదరీమణులు ప్రాణేశాంఘ్రిసేవాధనా
ధికసౌఖ్యంబులనంది, పుత్రకులవృద్ధింజేసి, యానందశీ
ర్షికవ్రాయన్వలె, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 85

మ॥ గళమాంగళవాద్య ఘోషములఁజక్కందిద్దు; సౌందర్యమా
కులకాంతామణులందు లేదు, పలుకుంగ్రొందేనకున్నెచ్చెలుల్;
ఫలమేమీ? విషకన్యలైననఁ; బ్రబంధోత్పాతంబు. లద్దానితోఁ
చెలిమింజేసినఁ దంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 86

మ॥ తనయుల్గల్గినస్వర్గమంచు వ్రతముల్దానంబులుంబుణ్యావా
హీనులన్ స్నానములాచరించెదరుగానీ, కోరికల్వీడి ని
న్ననయంబున్భజయింపఁ గాంతలనుబ్రహ్మానందపాదోధివీ
చిని దేలింపవె, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 87

మ॥ కొడుకుల్లేరని చెట్టుపుట్టలకుమ్రొక్కున్ మ్రొక్కి, కొన్నాళ్ళకో
క్కఁడుజన్మించిన; విద్యకై తిరిగి, భాగ్యశ్రీలనర్పించి, నా

కొడుకుంగోడలు చెడ్డవారలని లోకుల్నవ్వ వాపోదుకీ
చెడుగుల్దేనికి? తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 88

మ॥ వలయుంగానకళాప్రవీణతయు, రూపశ్రీల శ్రీదేవిగా
వలయుంగోడలటంచుఁ దెచ్చుకొని, యాపై నింటిలో శోకుగా
మెలఁగం; గర్గానలేనియత్తలకు స్వామీ! యోర్పు చేకూర్చియీ
చెలులన్బ్రోవుము, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 89

మ॥ తనతల్లిందనయన్నదమ్ముల నితాంతప్రేమ వీక్షింపుచుం
దనయింటంగల మంచివస్తువుల దత్స్వాధీనముంజేయు నీ
వనితర్భర్తను గన్నతల్లియనఁ గోపంబూనువారత్తఁ జే
సినపాపంబొకొ? తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 90

మ॥ సరసాలంకృతచారు చిత్రకవితాసామర్థ్యము; న్వేదశా
స్త్రరహస్యంబులనారి తేరిరని; విద్వత్కోటికా భూవిభుల్
కరులర్పించిరి, యగ్రహారములఁగా నక్కల్వెట్టి, రా భూములం
జెఱుపంబూనితె తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 91

శా॥ దానంబిచ్చినరాజులేగిరి, శిలాతామ్రాదితచ్చాసనా
లేనాఁడోచనె, విప్రవంశభవులా యింగ్లీషువారైరి, యిం
కీనాఁడేటికి యగ్రహారములంటంచీ బుద్ధిపుట్టించితే?
శ్రీనాథార్చిత! తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 92

మ॥ “స్థిరమా బ్రాహ్మణసత్తపోమహిమ జచ్చెన్; బ్యాటరీగొట్టముల్
దొరికెన్: లేదుకరెంటు; స్నానజపశాంతుల్మానుమా యావనీ
సురులా పూర్వపుటాస్తికర్మల నుచో, సుంతైన మావాఁడవై
సిరిదక్కింపవు? తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 93

మ॥ అలప్రాచీనుల ధర్మపద్ధతులు హేయంబంచు దాస్యంపుశృం
ఖలలంజిక్కినపుత్రపౌత్రులకు దక్కంగూడదీపుణ్యభూ

ములటంచుందమ పెద్దలాగ్రహముతో గామిశులంజేరి యీ
సిలుగుంఁదెచ్చిరో; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 94

శా॥ ఉండంగూడదుభూసురోత్తములకుద్యోగంబు; లేధాన్యమిం
బండంగూడదువీరిభూములను. దేవబ్రాహ్మణక్షేత్రముల్
గొండంచుంబ్రతిశాసనంబు లిపుడున్ఘోషించెఁ; నీవుండియుం
జెండానెత్తవు తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 95

శా॥ భిక్షంబెత్తికుటుంబరక్షణము నీవేసేయఁగాలేక, ముం
భక్షింపన్గరళంబు, శైలసుతనీపైఁబ్రేమతో నెట్టులో
రక్షించెన్బడలానిపాట్లుబడి, నింబ్రాగ్దింతుదారిద్ర్యముం
శిక్షింపంగదె తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 96

మ॥ పరమానందకరుబ్రహ్మనారదరుని న్భస్మంబుగావించుటల్
పురములున్మాటినిబూదిసేయుట: జంగంబున్మంచుహాలాహలం
బఱచేతంగబళించిమ్రింగుటలుగాదయ్యా! దరిద్రాగ్నిఁజె
చ్చెరఁజల్లార్పుట తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 97

శా॥ ఘోరాకారులుదైత్యవల్లభులు నీకున్నిష్ఠ్యులవ్వారినే
చేరంజీరివరంబులిచ్చి భువిలోశ్రీమంతులంజేసితే.
ధీరుల్బండితులన్నవారలకువిద్వేషంబుగాకుండునే!
శ్రీరాజద్గళి! దంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 98

మ॥ జ్వరబాధంగదలంగలేను, చెవిలోసంద్రంపుపెన్మ్రోత, నా
శిరమా గిర్గిర గిర్గిరం గిరగిరం శ్రీచక్రమైభూనభోం
తరముల్ద్రిప్పుచునుండె, నాకలముపద్యాల్వ్రాసియేతీరు; సు
స్థిరతంగూర్పుము దంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 99

శా॥ బాల్యంబాదిగ శ్వాసకాసలుననున్బాధించు; నస్మన్మన
శ్శల్యంబైబధిరంబుతోడుపడె; సంసారంబుభారంబు, నీ

కల్యాణాత్మకమైన శైవకథలాకర్ణింప; నత్యంతసౌ
శీల్యంబీగదె తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 100

శా॥ ఈవీశుండవు, నేకవీశుఁడను, స్వామీ! స్వర్ణరౌప్యాగముల్
దావుల్నీకు, శతావధానమునుపాధ్యాయత్వమున్నాకిసీ!
పోవఁ లేము దరిద్రమిద్దరికిసంపూర్ణంబి, కేయాశతో
సేవింతున్నిను తంగెడంచపురకాశీవిశ్వనాథప్రభూ 101

శా॥ వ్యాఘ్రంబై కబళించె వార్ధకము, దివ్యద్భోగభాగ్యంబులా
యాఘ్రాణించుటకైన లేవు, నిజహస్తాంఘ్రిశ్రవోనేత్రజ
హ్వాఘ్రాణంబులశక్తిజచ్చినది, డాయన్వచ్చిరక్షింపవే
శీఘ్రంబేనను, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ 102

మ॥ అనఘా! నీకునమస్కరించిపయనంబై పోవుచున్నాఁడ; నా
పనినెచ్చోనెరవేర్తువో విజయమూపాదింతువో, చింతతో
ననునాయింటికిఁజేర్తువో, యభయదానంబిత్తువో? యేమిచే
సినఁభారము తంగెడంచపురకాశీవిశ్వనాథప్రభూ 103

మ॥ జనులజ్ఞానముతోడ నూహలోకలలక్షల్సేసి; మోటారులోఁ
జనుచుండం, బెనుబాడదాకియదినాశంబంద, నాత్రోవలోఁ
జననష్టంబగు, నేరేఉంగుదురునీసంకల్ప, మీరీతిఁజే
సినదీవంచును తంగెడంచపురకాశీవిశ్వనాథప్రభూ 104

శా॥ ఎచ్చోభోజనమో, పరుండుటెచటో, యెవ్వానియాచించుటో
యిచ్చోకష్టమొ, యెచ్చటన్సుఖమొ, రేపేరీతిఁగానున్నదో,
యెచ్చోనేమగునో, యటంచుబుధుఁడెంతేగుందు దారిద్ర్యపుం
జిచ్చార్పంగదె తంగెడంచపురకాశీవిశ్వనాథప్రభూ 105

మ॥ ఉదయంబేగినరాత్రి; రాత్రిజనఁగానుండండి! మావాఁడులేఁ
డుదయంబిచ్చెదరండి! "మొండికెటులోనుండంగనుండంగ మీ

......

కిదిప్రాప్తంబనియెద్దియోయొసఁగు నిష్టివేళఁగష్టింపఁగాం
చెదవాబీదలఁ దంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ 106

మ॥ కవియున్భిక్షుకు డొక్కరాశి ; యయినంగష్టించినిద్రించు భి
క్షువు; రాత్రింబవలుంబఠింపవలె, లోకుల్మెచ్చ గ్రంధాళి వ్రా
యవలెన్ దాతలనాశ్రయింపవలె, వీయాయాసమున్బాపుమో
శివ! ప్రార్థించెదఁ; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 107

శా॥ దారాపుత్రులవీడి, తావకపదధ్యానంబుఁగావింపఁజే
కూరున్మోక్షమునాకునొక్కనికి: సంకోచంబు లేకుండ నీ
న్నారాధించినవారి కేనొసఁగుభాగ్యంబెద్ది; శ్రీలిమ్ము నిం
జేరన్వచ్చెదఁ దంగెడంచపుర కాశీపిశ్వనాథప్రభూ॥ 108

మ॥ జననంబందిననాఁడె!! నగ్గొలువమోక్షంబిత్తురన్నన్న నే
ననుమానింతుఁ? రాకపోవుదున? భార్యాపుత్రమోహాబ్ధిలో
ననుదేలించి, ధనంబాసంగవిదియన్యాయంబుగా నీకుందో
చినదా? తోచద: తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 109

శా॥ నాకున్దివ్యమొసంగుబుద్ధిమదిలోనన్గల్గి; నీచేతిలో
లేకున్నన్, గణనాథుతో, ధనదుతో, లేఖేశుతో, గౌరితో,
శ్రీకాంతాధిపుతో, వచింపఁగదె కించిన్మాత్రమైనన్న రే
చేకూఁగున్నివ! తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 110

శా॥ కాలంబొక్కవిధానముండదుసుమా! కాఁమ్మురాఁబోవుజ
న్మాలన్గట్టిగదీక్షఁబూనఁ ; గొనెదన్భాగ్యంబు రెట్టింపుగా;
నేలానిన్భలవంతబెట్ట; నిపుడీవీకున్న భిక్షాన్నమున్
స్త్రీలర్పింపరె; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 111

మ॥ పయనంబయ్యెడుకాలమందె నినునేఁ బ్రార్థింపఁగాలేదె, ని
ర్దయనాపై నిటుజూపెదం చెఱుఁగనౌరా! యింతపాషాణమా!

భయదంబైన భవన్మనంబుఁ గవుల న్బాధించుచోనన్నెపం
సి యడంగున్సుమ; తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥ 112

మ॥ శతలేఖన్యవధానమున్నలుపు సంచారంబునన్నేలువల్
పతకంబుల్గొని, నాటకంబులను, కావ్యశ్రేణి, నిక్కన్నియో
శతకంబుల్విరచించిడస్సితిని, నాసామర్థ్యముంబూర్వపుణ్
స్థితికిందేగదె తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభు॥ 113

## సమర్పణము

మ॥ ప్రతిసంవత్సరమాఘమాసమున నీపై భక్తిచేఁబూర్వపు
వ్రతులన్గంగమ, నన్నపూర్ణమను, కన్యాదానమున్జేయుభా
గ్యతముండిప్పుడి; మామకీనకవితాకన్యన్భవత్ప్రీతిని
చ్చితరించెన్గద తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥

మ॥ అమృతంబొల్కుచునుండ, నెల్లెడలశయ్యాపాకరీత్యాచితీ
క్రమవృత్తిచ్ఛటలింపునింపు కవితాకన్యన్భవత్పాద ప
ద్మములందుంచి తరించినారమికమిత్రత్వంబు బంధుత్వముల్
స్థిమితంబందుత దంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥

శా॥ కల్యాణాత్మకమైననీశతకమాకర్ణించి,యుష్మన్మహా
కళ్యాణంబు, రథోత్సవం బితర వేడ్కల్గాంచుభక్తాళికిం
గల్యాణాభరణప్రపౌత్రజయ సౌఖ్యశ్రీలనత్యంతసా
శీల్యంబీగదె తంగెడంచపుర కాశీ విశ్వనాథప్రభూ॥

మ॥ శివలింగబెటలుండునో యదియె, కాశీక్షేత్రమచ్చోటిదే
శివతీర్థం, బటనుండుభక్తవరులే శ్రీశైవదీక్షాపరుల్
శివపంచాక్షరమంత్రరాజ జపమున్సిద్ధించుఁ; జేకూరునీ
శివసాయుజ్యము, తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ॥

మ॥ జయ మృత్యుంజయ!సర్వభక్తజనవాంఛాసిద్ధిసంధాయకా!
జయ దైత్యేయ పురత్రయాపహరణాంచద్విష్ణుసంసాయకా!
జయ జన్మార్జిత ఘోరపాతకవనీస్వాహాస్వధానాయకా!
శ్రీయదా! మోక్షద! తంగెడంచపుర కాశీవిశ్వనాథప్రభూ

మ॥ రతి భారత్యమరాంగనానవసుధా
రాగార్ద్రి కర్పూర హా
రతి; కళ్యాణ మహోత్సవాగతము నీం
ద్రప్రోక్త వేదోక్త హా
రతి; బ్రహ్మేంద్రమరుత్కిరీట విలస
ద్రత్న ప్రభాపుంజ రం
జిత పాదద్వయ? తంగెడంచపుర కా
శీ విశ్వనాథప్రభూ?

ఇది,

శ్రీ మద్గోరావఝుల - సీతమాంబా సుబ్బ
రామార్యతనూభవ రామకృష్ణ సీతా
రామ సోదరకని ప్రణీతంబగు
శ్రీ కాశీవిశ్వనాథశతకము

–[ సంపూర్ణము ]–



# ప్రకటన.

నాలుగువందల సంవత్సరములఁనాటి తాటియాకుల పుస్తకములనుం డెత్తి వ్రాయఁబడి యచ్చుగాక నిలచిన రాయలసీమకవుల ప్రబంధములు.

(1) శివప్రభావాభిరామము — ప్రాతకోట పుల్లకవి.
(2) ఆకాశరావణసంహారము — ఉరుటూరి వెంకటకృష్ణకవి,
(3) సూత్మ్రతమవిద్యావిలాసము — కొమ్మద్ది-సుబ్బరాయకవి.
(4) రాధాకృష్ణవిలాసము — సంబరాజు-తిరుమలరామదాసఁక
(5) దత్తాత్రేయశతకము — క్రిష్టిపాటి-వెంకటసుబ్బకవి.

—[ మాచే రచింపబడిన ముద్రితగ్రంథములు ]—

(1) శ్రీరామ నిర్యాణ నాటకము.
(2) కృష్ణకథామృతము.
(3) తేన సోనెలు బాలకవిరత్న అ॥ సీతారామకవిగారిది.
(4) కాశీపురాణము - నశ్యవిజయము.

చిరునామా
విద్వాన్. గో. రామకృష్ణశాస్త్రి, శతావధాని.
మున్సిపల్ హైస్కూలు,
కర్నూలు.